


# భూతదయ

ఈ పాడేది ఇప్పుడిప్పుడే మస్తాబేస్తూ వుంది, సూర్యుణ్ణి ఆహ్వానించాలని. ఆవూళ్లో రామ మందిరపు ఆవరణంలో జనులు గుంపులు గుంపులు మూగసాగినారు. మండపందగ్గర అప్పుడే పుట్టిన శిశువొకటి చలికి గడగడ వడకుతూ ఏడుస్తూ పడివుంది. స్త్రీ పురుషు లెందరో చూస్తూ చుట్టుకున్నారు. మనుష్య ప్రకృతి గోడ దాటులాంటిది. ఎక్కడైనా నలుగురు కూడితేచాలు వాళ్ళ చూడ్డానికి కింకంద లో పోగైతారు. ఒకరినొకరు తోసుకొని పోయి ఆసంగతేమిటో చూడ్డానికి ప్రయత్నిస్తారు. పూర్తి వివరాలు తెలియకున్నా ఉన్నవి లేన్ని గ్రీతవివరాల్ని కల్పించి కథ అల్లటం మనుష్య ప్రభావం అంతటనుకే! అసలు కార్యం రంగంలోకి దిగుట కొక్కడూ కాలు కదపదు, ఆకాశపు రాతలు కడదలూ కాస్తురే! అప్పు డెక్కడకూడ తలాంటివారిదే మెజారిటీ.

"పాపం! ఎవరిదిల్లో!"

"ఏదివ కేదియ?"

"ఎవితంకుపడుచో. ఎదిగిన కన్యేదిఉండా లే, అమెదుష్కర్మ ఇల్లామూర్తీభవించింది."

ఇదివిని ప్రతివాడూ ఎదుటివాడూపనికి పూనుకొవాల్సి నే భావం గనపడచే చూపుల్తో చూడసాగాడు.

ఆగుంపులోం చివరైనా ముందు కొస్తారేమోనని కొంత సేపటిదాకా ఎదురుచూచి

"ఏమో! ఇంతమందిలో ఈ శిశువుకు రక్షణ మిచ్చే దాతలూ దయార్ద్ర హృదయులూ ఒక్కరైనా లేరా? చెప్పండి. ఎవరూ సంసిద్ధంగా లేరా?" అన్నాడాయన.

కర్తగా ఆదేశమయానికి ఓ క్రైస్తవ ప్రచారకులు గుంపును తోసుకొచ్చి తానా అర్భకుని పోషకత్వభారాన్ని వహిస్తున్నానని చెప్పింది. ఇంతకొ యిద్దకారిహూడా సన్మతించి ఆశిశువు నామె కొప్పగించాడు.

* * * *

"ప్రపంచ మెంత తేమాషా వ్యక్తుల్తో నిండివుంది!"

"ఆతల్లికి పసికూనను విడుచుటకు మనస్సెట్లా వచ్చిందో!" "పాపం చేసేఅప్పుడు ఎంత మజాగానైనా ఉంటుంది. ఇదంతా ఇప్పటి పంపు సంస్కారుల ప్రతాపం."

## వెల్దుర్తి కాలోజీ అవధాని

"పాపం! ఎవరేనా ఎత్తుకోండమ్మా!" అన్నది, వడుము కువెయ్యానిలుచున్న ఒకావిడ,

"ఏ పాడుపీనుగో. ఏజాతివాడో ఎవరికలుక! గాలికిపోయే కంప మనమెందుకు నెత్తికెత్తుకోవాలె? జడలో పూలను సర్దుకుంటూ పలికిందో వృద్ధనారి.

ఇల్లా జరుగుతూవచ్చాయి ప్రసంగాలు,

ఆశిశువు ఏపరిస్థితుల్లో పుట్టిందో, పుట్టించకలిగో, మరితల్లి చెండ్లికానిపడుచో, ఈమతియని చేతంతుకో అని ఇష్టం వచ్చినట్లు వాదుకొసాగింది మూగినజనం.

అటు తాపేచ్చి ఏచ్చి అపనికఁదుకు మనికొనూర్చున్నప్పటికీ దగ్గఱకేసే ధారంతలం మాత్రం ఒక్కరికీలేదు.

ఊదరకు ముద్దగట్టుకో పోతూవున్న ఆపసికూనను దయావస్త్రంలో దాచటాని కొక్క స్త్రీయైనా ముందుకు రాలేదు; ఒక్కపురుషుడైనా సంసిద్ధత జూప లేదు. ఏతల్లి కూడా ఏడ్చేపాపను చంక కెత్తుకొని ఊరడించాలె అనే బుద్ధి పుట్టలేదు.

ఇలా ఎంతసేపో గడిచింది. అంతట్లో ఓర ఫుక శాఖాధికారికూడా ప్రత్యక్షమైనాడు. సంగతులన్నీ తెలిసికొని అక్కడ మూగినవారి నిల్లా సంబోధించాడు:

"దిక్కులేని ఈపిల్లవాడి కాశ్రయమిచ్చేందుకు మీలో ఎవరైనా సిద్ధంగా ఉన్నారా?"

"ఇంకా ఎన్ని విడ్డూరాలు వుడతాయో చూడక పోతామా!"

"కాలమే మారి పోయింది, ఇంకేముంది!"

"ఇద చలిగారి లాంటి స్వేచ్ఛావాదుల కవల పరిణామం అంటే తప్పేమి?"

"ఆడవాళ్లు అక్షరాస్యులైతే ఇట్లే బయల్దేరుతాయి ఈరోజుల్లో" ఇల్లా అనుకుంటూ ఎవరిదోవన వారు వెళ్లిపోయినారు.

* * * *

కాలచక్రం రెండాతెలు తిరిగింది. అదేఊరు అదేదేవాలయం. అదేఆవరణం; అదేసమయం, మళ్లీ స్త్రీపురుషు 'ల్లానే' మూడారు. ఇసుక చల్లినా రాలకుండా వుంది గుంపు, పిల్లనకా, పెద్దనకా, ఉన్నవారున్నట్టూ, విన్నవారు విన్నట్టూ పరుగెత్తుతూ వచ్చారు జనులు, అదో జాతరలాగుంది ఎప్పటివలెనే ఆరోజు కూడా పూజారి ఆలయానికి వెళ్ళాడు. రెండేళ్ల నుందు నవోదిత శిశువు కేవ్వుకేవ్వుమని యేడుస్తూ పడివుండిన అస్థలంలోనే శ్రీరామచంద్రుని చక్కని శిలావిగ్రహ మొకటి పడి ఉంది. నిమిషార్థంలో కార్చిచ్చువలె ఊరంతా ప్రాకిపోయింది కబురు. శ్రీరామచంద్రుడే సాక్షాత్తుగా అవతరించాడంటే జనం గుంపులు గుంపులుగా పోగవడంలో ఆశ్చర్యమేముంది? అవచ్చినవారంతా విగ్రహానికి నమస్కారాలు చేస్తున్నారు. భక్తి పంతో పూలు, పండ్లూ అరటులూ, ఒకరికంటే ముందొకరు సమర్పించాల్సని తహతహపడు తున్నారు. 'అందరి కంఠాలు పారవశ్యంతో గద్గదికొలయి వున్నాయి.

అంతట్లో రుద్రాక్ష మాలాలంకృత కంఠంతో జోడుకాలువలు కప్పుకొని, చెవుల్లో కుండలా లల్లలాడుతూ వుండగా పీఠాస్థుడు జనాన్ని ప్రక్కకు తోసికొని మూర్తిని సమీపించి భక్తిభావంతో దాన్ని తన ఎదకదుముకున్నాడు. గద్గదికకంఠంతో రామ భజన మొదలెట్టాడు. అక్కడివారంతా నిశ్చేష్టపడి చూడసాగారు. వారి నిశ్శబ్దపాటును తొలగించేందుకో కాస్తున్న, కప్పుతున్న కాలువతో కన్నీరద్దుకుంటూ ఇల్లా చెప్పసాగాడు.

"ఏమని చెప్పాలె? ఎంతని చెప్పగల్ను! ఇన్నేండ్లనుగదా నారామభక్తి ఫలించింది. స్వయంగా రామచంద్ర ప్రభువే నాకు దర్శనమిచ్చాడు స్వప్నంలో సాక్షాత్ రాముడే నా కనుపడ్డాడు పాపినైన నన్ను పవిత్రంచేశాడు ఎడమవైపు మాతృమూర్తి సీతాదేవి, దగ్గరనే తమ్ముడు లక్ష్మణుడూ నిల్చియున్నారు. భరత శత్రుఘ్నులు చామరాలేస్తూవున్నారు .అంజనేయుడు కొల్లిపటుతూ వున్నాడు ఆహా ఏమి ఆదివ్యదృశ్యం!! అహా, ఏమి నా అదృష్టం!!' అహోభాగ్యం!!

అని పల్కుతూ. అప్రతిమను కౌగిలించుకొని, స్మృతితప్పినట్లూ శివమెత్తినట్లూ నటించసాగాడు.

"తర్వాత జరిగింది, ముందేమైంది" అని ప్రశ్నపరంపరలను, ధర్మాభిమానులైన స్త్రీపురుషులు, ఆతురతతో కురిపించసాగారు. కన్నిమూలి, సమాధి భంగమైనట్లు నటించి,స్వప్నంయొక్క ఉత్తరార్ధాన్నిలా అందుకున్నాడు:--

"రామచంద్ర మహారాజు నాతో"వత్సా? సంస్కారులవిరుద్ధం నీవుగ్రానించే సమరం నాకంతో వచ్చింది. భక్తాగ్రణీ! నేనీ వూరి రామమందిరమునలో తం తెలమీద పడివున్నాను. నాకొక కో దేవాలయముకట్టించు. అందుస్నేచ్ఛావాదులూ, సంఘసంస్కారులూ వీరికి వ్యతిరేకంగా సమరసన్నాహములు" జరుపుఅని సెలవిచ్చారు. "దేవరవారికి దాసునిపై ఇంత అనుగ్రహం కలిగిందంటే నాకేమి కొదువ!" అని చేతులుజోడించాను. నేనప్పుడు నాలోలేకుంటిని. సమాధిలోవుంటిని. అంటూ తాదాత్మ్యకత్వాన్ని నానభావ విన్యాసాల్తో ప్రదర్శించాడు. జనమంతా తనవల్లో చిక్కిందని తెలిసి యిలా ప్రారంభించాడుమళ్లీ.

"కండ్లు తెరచిచూచేసరికి శ్రీరాములవారదృశ్యులైనారు, లేచి ఆట్టే పరుగెత్తుతూ ఇక్కడికొచ్చేసరికు దమ్మో తీసుకోలేదు. ఇక్కడ నాకేమగుపడ్డదనుకున్నారు? ఆదేస్థితి. ఆదేదృశ్యం, అదే నీరదచ్ఛాయ నీటుచున్న సుందరవిగ్రహం.

ప్రతిస్త్రీ, ప్రతిపురుషుడూ "శాస్త్రిగారు నిజంగాధన్యులు. అందుకే స్వయంగా శ్రీరామచంద్రులు వారికి దర్శనమిచ్చారు" అంటూ సాష్టాంగపడ్డారు,

ఇంతలో పూజారి ఒకపీటవలంకరించుకొని తీసుకొచ్చాడు. శాస్త్రిగారు పదిలంగా ఆవిగ్రహాన్ని అపీటపై ఉంచాడు. దేవుడికి చలేసుందని శాస్త్రిగారు శాలువకప్పారు, ఇద్దరు స్త్రీలు వింజామరలు వేయసాగారు. క్రైస్తవ బ్యాండు, తురకతాషాలు, నౌబత్తులు, డప్పులు మున్నగు వాయిద్యాల్తో ఆ శిలావిగ్రహాన్ని ఊరేగించారు. ఇండ్లముందూ, కప్పులపైనా కిటికీలల్లో, సమ్మాల్లో, చెట్లమీదా, చేల ఈనినినట్లు కిటకిటలాడుచూ ఎక్కడ చూసినా జనులు క్రిక్కిరిసి ఊరేగింపు చూస్తూవున్నారు. అపరిమితమైన భక్తితో దేవునికి హారతులు,నివేదనలూ సమర్పిస్తూవున్నారు. ఇట్లు రథాన్ని వీధులన్నిటిలో ఊరేగించి మళ్లీ దేవాలయానికి తీసుకొచ్చారు. పిన్నలు పెద్దలూ బ్రాహ్మణాది అన్ని జాతులవారూ ధనవంతులూ బీదలూ అనే భేదంలేకుండా తోచిందేదో అక్కడ సమర్పించుకున్నారు. చూచేలోపల వేలకొలది ద్రవ్యం మందిరం కట్టించడానికిగాను పోగైంది. అదంతా మనశాస్త్రిగారికీయబడ్డది. ఇంతకూ శాస్త్రిగారికే యశశ్శరీరం లభించింది. అవకాశాలుదొరికినా లాభంపొందేవారే కావాలెకదా?

* * * *

నిమిషంలోనే శిలావిగ్రహానికని వేలరూపాయాల చందా వసూలైంది. గర్భగుడిత మందిర మొకటి నిర్మింపబడ్డది. ప్రారంభోత్సవంనాడు మండపాన్ని అలంకరించారు. పతితపుష్పాల్తో కొంకర్కంకోసం కడవల్లో పాలూ, కావళ్లతో పెరుగూ, బండ్లనిండా పండ్లూ సమకూర్చబడ్డాయి. ప్రసాదంకోసం గుట్టలు గుట్టలు చేర్చబడ్డాయి. పదార్థాలు అరోజు గ్రామంలో అందరికీసంతర్పణ. ఒకొక్కక్క పక్తిలేపడం మొదలెట్టింది. ఇలాంటి హడావుడి అవూర్లో ఇదివరకెప్పుడైనా జరిగిందో లేదో అ ఒక్కరోజే తెలు సెలవయినై.

ఇదంతా ఎందులకు? ఎవరికోసరం? ఊరూ పేరూ తెలియని అవ్యక్తుడగు ఓ శిల్పకారుని కృషిఫలితమగు శిలావిగ్రహంకోసం. రోజూ సక్రమంగా పూజ జరుపుటకు ఓ మార్వాడీ ఒక పెద్ద మొత్తాన్ని దానంచేశాడు. దేవాలయంలో మువ్వాటలూ వాజంత్రములు మోగించేందుకో ధనవంతులాలు ప్రారంభించింది!

* * * *

ఒకచోటుల్లో, ఒకే నల్లో జరిగిన భిన్న భిన్న ఘటనలు చేతోయుగా చిత్రింపబడ్డయి.

హిందూసమాజంలో జన్మించిన నిరపరాధుడైన అశిశువుకక్కడా సమాజమాశ్రయాన్నియలేదు. తుదకతడో క్రైస్తవకరణాలయంలో తలదాచుకోగలిగాడు, మతి శాతిబాహ్యకొ పాటిలేని గౌరవం దొరికినది. ఇట్టిదేమనదు ధర్మంపైఉన్న ఆదరం—[సేమాను! ఇదే మన భూతదయ!!




అల్పదృష్టులగు కొందరువిరోధులు తమసిగరేట్లను వృద్ధిపరచదలచి మాకంపెనీలో తయారైనట్లుగా విశదపరచుచున్నటుల మేము వినుచున్నాము. ఇట్టి అసత్యప్రచారమువలన జనసామాన్యమునకు భ్రమకలుగవచ్చును. మా ఫ్యాక్టరీలో యీ మూడువిధములగు సిగరేట్లు మాత్రమే తయారగుచున్నవనిమాక్రయవిక్రేతలకు విశదపరచుచున్నాము.

(౧) దక్కన్‌ఫ్లాగ్ (౨) గోలకొండ (౩) చార్ఖందిల్ ఈమూడుతప్ప వేరే విధమగు సిగరేట్లు మాఫ్యాక్టరీవని నిర్ణయించిన యిట్టిఅసత్యప్రచారమునువిశ్వసింపవలదని హెచ్చరించుచున్నాము.

దీ హైద్రాబాదు సిగరేటుఫ్యాక్టరీ
ముషీరాబాదు, హైద్రాబాదు.

మూడువిధములలో

## ప్రసిద్ధిజెందిన సిగరెట్లు

1 గోలకొండ 2. దక్కన్‌ఫ్లాగ్ 3. చార్‌ఖందిల్

హైద్రాబాదుదక్కన్‌సిగరేటుఫ్యాక్టరీ (హైదరాబాదు దక్కను)

# స్వతంత్రము — పొందుటకు

INDEPENDENCE

ఉద్యోగపు దాస్యమునుండియు, నిరుద్యోగపు విచారమునుండియు, స్వతంత్రతపొందుటకు

## స్టార్ ఏజన్సీ తీసికొనుడు

| | |
|---|---|
| 1. జీతము లేక మంచికమీషను | 4. శాశ్వతోద్యోగము |
| 2. పరంపర వేతనము | 5. అందరికి ఉపయోగపడు పద్ధతులు |
| 3. ప్రావిడెంటుఫండులాభములు | 6. మీ జయమునకు కావలసిన అవసరము |

మీ విజయము స్థిరము

వలననగా:—మా పట్టాలు రద్దుకానేరవు.
అశక్తత లాభములు ప్రతి పట్టాకును గలవు.
స్వల్పసొమ్ము హెచ్చుగ చెల్లించిన, ఆకస్మికప్రమాదముల వలన లాభములుగలవు.
మా నిశ్చలత్వము నిస్సందేహము.
పాలిసీలుహాలీనాణెములో నివ్వబడును.

వివరములకు వ్రాయుడు:—

## ది స్టార్ ఆఫ్ ఇండియ ఐ.ఓ.జి.
## అష్యూరెన్సుకంపెనీ, లిమిటెడ్
(మదరాసు)

డివిజనల్ ఆర్గనైజర్
నిజాంరాష్ట్రమునకు

బ్రాంచి: హనుమకొండ

తంతి అడ్రసు "సంఘోయి" నౌ తము 3

## జాగ్రతగల ప్రయాణికుడు బాధ్యతనువహింపడు

ప్రయాణముచేయునప్పుడు రొక్కమును వెంటను చుకొనుట సాధారణముగ అపాయకరమునునైయున్నది. నిర్విచారముగా ప్రయాణము చేయదలచిన యెడల

## సెంట్రల్ బ్యాంకుయొక్క ట్రావెలర్సు చెక్కులను ఉపయోగింపుడు

అవి:—
1. నష్టముకలుగకుండ కాపాడును.
2. రొక్కముకంటె సులభముగా తీసికొనిపోవచ్చును.
3. 25,50 100 రూపాయిలు మొత్తములలో దొరకును.
4. హెడ్డాఫీసులోను ముఖ్యమైన బ్రాంచీలలోను దొరకును. ఏబ్రాంచిలో నైనను ఆఫీసులో పేరునను నగదు యివ్వబడును.

# అపూర్వమైన గొప్పధార్మిక తెలుగు ఫిలిము

# దశావతారములు




ఇందుపాల్గొను నటకావతంసములు

పారుపల్లి సత్యనారాయణ,

దొమ్మేటి సత్యనారాయణ

బాలభాగవతార్.

బి. రాధా కృష్ణమూర్తి,

మాస్టర్ బొండాం.

నగరాజకుమారి, గిరికుమారి.

అనసూయ

ఇంతకు ముందెన్నడును యిట్టి ఫిలిమ్ రాలేదు

ఇట్టి మహోత్తర విషయము నెన్నడు చూడబోరు

గాంభీర్యమైన దృశ్యములు    రసములొలుకుపాటలు

## ఇంపీరియల్ టాకీసు

సికింద్రాబాదు

21 ఆగష్టు 1937    శనివారము మొదలు    15 మెహర్

# మకరధ్వజరసం

మేలిమి బంగారం, కస్తూరి, అంబరు, విలువ గల్గిన భస్మములతో తయారైనది. 1 మాత్ర వేసుకుని పాలు త్రాగినచో 1 గంటలో అప్పటికప్పుడు 70 సంవత్సరముల వృద్ధులకైనను నవ్యయవ్వనులకైనను నీరైన వీర్యము పుట్టిపప్పి శీఘ్రస్ఖలనం ఆపుచేసి లింగటుత్వము విశేష కామోద్రేకముగల్గించి 4 గంటలవరకు వీర్యస్ఖలనం గాకుండ ఆపుచేసి యెంతమంది భార్యలకైనను తృప్తిదీరునట్లు సంభోగ సౌఖ్యము గల్గించుటకు గ్యారంటీ 1 సీసా 50 మాత్రలు రు 10 ప్రతి మాత్రలోను బంగారము కనుపించును.

# నపుంసకతైలం

బాల్యములో ముష్టి మైధునం చేతను, రంకు రోగముల చేతను కాల పరిమితిలేకుండ భోగించుటచేతను నరములు బలహీనత చెందినవారికి యీ ఔషధము దివ్యామృతము. వృద్ధులకు పైతము యున్న కలిగివప్పుడెల్ల సంభోగ శక్తిని గలిగించును. 1 సీసా రు 10 వి.పి 0-8-0.

డాక్టర్ రత్నంబ్రదర్సు మెడికల్ హాల్
252, బి. మలకపేట, హైద్రాబాదు.

కలరా    కలరా
భయములేదు    భీతిజెందకుడు

కలరాకు దివ్యౌషధము

## విక్టర్‌డ్రాప్స్ మిమ్ము కాపాడగలదు.

గ్రహణి, అతిసారము, కలరా రక్తవిరేచనములు, కడుపుబ్బరములు అజీర్ణము వాంతిభేదులు మొదలగువాటివి తప్పక కుదుర్చును, రెండు మూడు మోతాదులు పుచ్చుకొనినచో కలరావలన కలుగు వాంతిభేదులుకట్టుకొనును అనేకులు మావిక్టర్‌డ్రాప్స్‌ను ఉపయోగించి ప్రాణముల కాపాడుకొని యోగ్యతాపత్రము లొసగియున్నారు. కలరావ్యాధులకు వాడబడుచుండు ఔషధములలోకెల్ల మావిక్టర్‌డ్రాప్స్ ప్రశస్తమైనదని డాక్టరులు పొగడియున్నారు. మరియు అన్ని వయసులవారికి నిర్భయముగా వాడవచ్చును.

హోల్ ఏజంట్లు: విక్టర్ అండు కో
పెదగడియారం హైద్రాబాగ్ దక్కన్
దవాఖాన, విక్టర్ అండుకో
సుల్తానుబజారు

# రాష్ట్రీయ వార్తలు

## తిరుమలగిరి బజార్

(ఒక విలేఖరి)

౧౦-౮-౩౭:—

### వైశ్యస్త్రీ పునర్వివాహములు

గురువారం సాయంత్రం ౭ గంటలకు, ఆర్య వైశ్య యువజన సంఘమువారు సంఘాధ్యక్షులగు శ్రీయుత మంచికంటి వీరయ్యగుప్త గారి మేడఎదుట, ఏక ముహూర్తమున రెండు పెండ్లిండ్లు (పునర్వివాహములు) గావించిరి. హైద్రాబాద్ పండితులగు శ్రీమాన్ పూర్ణచంద్రజీ గారు పౌరోహిత్యమున వివాహసంస్కారము జరిగినది.

పెండ్లికొడుకు
శ్రీ ఉపిరిశెట్టి వెంకటరంగయ్యగారు
వయస్సు ౩౫ సం॥లు, పీల్ ఖానా,
హైద్రాబాదు-దక్కన్

పెండ్లికూతురు
శ్రీమతి పెండ్యాల లక్ష్మిదేవి, ౧౭ సం॥లు
యిండిరియాల్, భోనగిరి తాలూకా

పెండ్లికొడుకు
శ్రీయుత కొత్తూరి వెంకయ్యగారు
రెజిమెంటల్ బజారు, సికింద్రాబాదు

పెండ్లికూతురు
శ్రీమతి అనుతోట ముత్యాలు, ౧౨ సం॥లు
పులిగిల్ల బజారు, భోనగిరితాలూక

హైద్రాబాదు, సికింద్రాబాదు, బొల్లారం నుండి ధనికులు, పలుకుబడిగల వైశ్యప్రముఖులు, వైశ్యేతరులును, స్థానికులగు వైశ్యులు, వైశ్యేతరులును, ముఖ్యముగా మహారాష్ట్రులు, స్త్రీపురుషులనేకులు సుమారు ఐదువందల జనము వచ్చి వివాహసంస్కారము లోను, ఉపాహారవిందులోను పాల్గొనిరి. శ్రీమాన్ పండిత పూర్ణచంద్రజీ గారు హిందీభాషలోను, శ్రీయుత కొల్లా కాశీవిశ్వనాధం (తెనాలి) గారు, శ్రీయుత శ్యామరావు (సికింద్రాబాదు) గారు, శ్రీయుత అనంతరామయ్యగుప్త గారలు ఆంధ్రములో పునర్వివాహములు తప్పక చేయవలయుననియు, చేయనిచో సంఘములో చెప్పనలవికాని, పాపకార్యములు జరుగుచున్నవనియు, స్త్రీలను వ్యభిచారమునందియు, భ్రూణహత్య, శిశుహత్యలనుండి తప్పించి స్వేచ్ఛగా వరునితో పెండ్లిచేసి వితంతుస్త్రీల జీవితము సుఖవంతము చేయవలయుననియు, హిందూమతములో రోజురోజున యున్న మొదలుకొని యూరుకోట్ల వితంతువులుండుట అవమానకరమనియు, వితంతువివాహములు పూర్వముకూడా అగుచుండెననియు కనుకనే చరిత్రలలో, శాస్త్రములలో, వేదములలో ప్రమాణములు కనబడుచున్నవనియు, అసలు మొదటి వివాహములు పసితనంలో కేవలము మంత్రములతోనే పూర్తియగుచుండుటచే అవి వివాహములుగా లెక్కింపగూడదనియు వీనినే ప్రథమ వివాహములుగా భావించి వితంతువులకుండ చేయవలయుననియు, యిందుల కల్లరు చేయునెడల నొసగవలెననియు హెచ్చరించిరి. పిదప ఉపహారవిందుతో వివాహ సంస్కారము సమాప్తమాయెను.

## జగత్యాల

[ఒక విలేఖరి]

౧౦-౧౧-౪౬:—

### హరికథ కాలక్షేపము

ఈ శ్రావణశు॥ ౪ మంగళవారమునుండి శ్రీరామ మందిరమున వేములవాడ వాస్తవ్యులగు బ్ర॥శ్రీ॥ కేసనగారి రామయ్యగారిచే హరికథారూపమున జరుగుచున్న సంపూర్ణరామాయణము శ్రావణమాసముతో పూర్తియగును, వీరికంఠము మృధుమధురమైనందున ప్రతిదినముజనులు గుంపులుగుంపులుగా హరికథకు వచ్చుచున్నారు.

### గ్రంథాలయము

ఇక్కడి గ్రంథాలయస్థితి చాల విచారకరముగానున్నది. గ్రంథాలయము విద్యావస్థలో యున్నటుల పత్రికలో వికరింపబడినను ఇప్పుడు పూర్తిగ నిద్రచెందిన దనవచ్చును. ఇది యీపుర జనుల దురదృష్టమే. చిన్నచిన్న గ్రామములో గ్రంథాలయములు స్థాపింపబడి ప్రజాసేవసలుపుచుండుట, నగరము వంటిస్థలమునందున్నది మూసివేయుట అజ్ఞాకరము.

సిరిసిల్ల గ్రంథాలయమునకు యీలోగమే పట్టినటుగలదు. కరీంనగరంజిల్లాలో ప్రసిద్ధికెక్కిన తాలుకాలు రెండు. సిరిసిల్ల, జగత్యాల రెండు గ్రంథాలయముల కొకటే గ్రహచారము చుట్టినది. ప్రఖ్యాతిగాంచిన తాలుకాలలో గ్రంథాలయములు లేకుండుట అవమానకరము. ఈ జిల్లావాసులు ఐకమత్యముగాయుండి బాల్య భిమానము, మాతృభాషాభిమానమై చతుర్థాంధ్రమహాసభ జయప్రదముగా గావించిరి. ప్రస్తుతము ఇటీవల జేనిజామాబాదులో ప్రతాపరుద్ర గ్రంథాలయ వార్షికోత్సవ సందర్భమున సుప్రసిద్ధ ఆంధ్రనాయకులగు శ్రీయుత సురవరము ప్రతాపరెడ్డి బి.ఏ. బి.యల్. గారు తమ అధ్యక్షోపన్యాసమునందు గ్రంథాలయములు సరస్వతీ దేవాలయములనియు, చతుర్ముఖుని తపోవనములనియు, భక్తియంత్రాలయములనియు, ఈ దేవాలయములలో స్పర్శాస్పర్శ దోషములు లేవనియు, శ్రద్ధాపుష్పమే పూజాద్రవ్యమనియు, ఈ పుష్పము కలవారందరు పూజారులేయనియు, గ్రంథాలయముల విలువ రేజాతి ఎరుగునో, ఆజాతి పూజనీయమైనదనియు, తన మాతను, తన మాతృభూమిని, తన మాతృభాషను ప్రేమింపనివాడు ద్విపాద పశువు యగుననియు యిట్లు అనేకమైన ఉపమానములతో గంభీరోపన్యాసము గావించిరి, ఇ తేగాక మొన్న మొన్న నే యీప్రాంతమునకు ఆంధ్రసభాధ్యక్షులును, శ్రీ మాడపాటి హనుమంతరావు హైకోర్టు వకీలుగారు సురవరము ప్రతాపరెడ్డి బి.ఏ. బి. యల్ గారు విచ్చేసి గ్రంథాలయము విద్యను గురించి హితోపదేశ మొసగ్గిరి. ఆంధ్రసోదరులు యికనైనను గ్రంథాల యాభివృద్ధికై తోడ్పడుటకు మనఃపూర్తిగ విన్నవించుచున్నాము.

## కూరెళ్ల

[ఒక విలేఖరి]

౧౦-౧౧-౪౬

### జాగీర్దారుగారి రైతు ప్రేమ

### అక్రమ పన్నులు చెల్లింపలేక రైతులు మాల్గుజారి శరణు జొచ్చుట

ఇది భువనగిరి తాలూకాయందలి యొక జాగీరుగ్రామము. మీరు మహమ్మదలీఖాన్ సా॥ గారు జాగీర్దారులు. సుమారు ౧౨వేల ఆదాయముగల గ్రామము, జాగీర్దారు సాహెబుగారు తమను నిరంకుశ స్వతంత్ర చక్రవర్తిగా నిశ్చయించుకొని రైతులను వారిచేతిలోని కీలుబొమ్మలుగా నాడించుచున్నారు. ఎటులైనను సరే రైతులనుండి హెచ్చుమువచ్చిన చాలా సంతసించుచుందురు. వీరవలంబించిన చిత్రపద్ధతులకు తాళలేక రైతులందరు మాల్గుజారీ శరణు జొచ్చుటకు నిశ్చయించి నగరమునకు వెళ్లినారు. మాల్గుజారి అధికారులకు క్రింది విషయములు దరఖాస్తుమూలమున విశదపరచెదరట, రైతులెటుల రక్షింపబడెదరో, జాగీర్దారుగారి బారినుండెటుల కాపాడబడెదరో చూడవలయును.

### పరిపాలనా వివరములు

రైతులపై యేర్పడియున్న అక్రమపన్నులద్వితీయములు, పన్ను నిర్ణయపద్ధతి క్రూరముగాగలదు. భావిక్రింద సాగుబాటుచేయబడు ౨ యెకరముల భూమికి రు.౧౦౦ యివ్వవలసి యున్నది. గ్రామమందున్న చెరువుక్రింది పొలములన్నియు స్వంతపరీలుగా పెట్టుకొని యున్నారు. డబ్బు అవసర సమయములందు వీరు రైతు భూములను యొకరినుండి మరొకరికి నజరానాలు తీసుకొని యిచ్చుచున్నారు. రైతుల విరాసతు సమయములో రు ౧౦౦ ల కన్న తప్పుగాగ్రహించరు. మొత్తముపై వీరు జరుపుచున్న పాలనము క్షేమము భరించలేక సర్వనాశనమగుచున్నామని రైతులు ప్రభుత్వము వారికి తెలిపిరి.

### వర్తక న్యాయము

గ్రామమునందు వర్తకము చేయదలచిన ప్రతి కోమటివానినుండి సం॥నకు 30 రూప్యములు యిజారాకై తీసుకొనుచున్నారు. కాని యీసంవత్సరము జాగీర్దారుగారు భువనగిరి యందలి యొక వైశ్యునికి రు ౨౫౦ లకు వర్తకపు గుత్తా యిచ్చినందువలన వీరు తమ యిష్టానుసారము ధరలు హెచ్చించి వస్తువుల విక్రయించుచున్నారు. గ్రామమున వేరె కోమట్లకు వర్తకపు వీలులేనందున గత్యంతరము లేక పరగ్రామాభిముఖులైరి. దీనివలన పేదరైతులకు కలుగుచున్న నష్టమింతింతని యనుటకు వీలులేదు.

### ఇండ్ల పన్ను

రైతు లెవరైన యిండ్లు కట్టుకోదలచిన నిర్ణీత ప్రకారం నజరానుచెల్లించి జాగీర్దారుగారు వివరించు అస్పష్టమగు భూములలో కట్టుకోవలయును. ఆ రైతుమాత్రము భూమికగ్గినను కిస్తుపైకం యథావిధిగనే చెల్లించవలసి యున్నది.

ఇట్టివే యనేక విషయములు మాల్గుజారివారికి దెలుపబడునట, పర్యవసానము చూడవలయును.

## మధిర

(స్వకీయవిలేఖరి)

### పోలీసువారి శృంగార చర్యలు

౧౧-౧౧-౪౬

సుమారు నెల రోజులనుండి ఈ గ్రామము లోను చుట్టుప్రక్కల కొన్ని గ్రామాదులలోను కలరావ్యాధి విశేషముగా వ్యాపించి యున్నది. ఇప్పటివరకు ఇక్కడ ౩౦మందికి ఎక్కువగా మరణించినారు. ప్రతి దినము సగటున ఇద్దరు మరణించుచున్నారు. తాలూకా వైద్యాధికారి టీకాలవేయుచు మందులు ఇచ్చుచున్నను ఎక్కువలాభము కాన్పించుటలేదు.

### అధికారుల దౌరాలు

కరోడిగిరి నాజముగారు దౌరాపై ఇక్కడికి దయచేసినారు. ఇచ్చటి మున్సఫుగారున్నూ మధ్యం తాలుక్దారుగారున్నూ, ఎర్రుపాలెము దౌరానుంచి ఈరోజే తిరిగి వచ్చినారు.

### పోలీసు అమీనుగారి వింతచర్యలు

నిన్న ఎర్రుపాలెములో అర్ధరాత్రవేళ దౌరాపై అక్కడనున్న పోలీసు అమీను శేకరెడ్డిపల్లి జాగీర్దారులలో ఒకరగు జములాపురం లక్ష్మారావు దేశపాండ్యాగారి ఇంటిలో దురుద్దేశముతో ప్రవేశించి దేశపాండ్యాగారి భార్యను సమీపించగా యజమాని మేల్కొని అమీనువెంటబడెను. యువకుడైన అమీను చావుదప్పి దారిలో ఒకటి రెండుచోట్లలో క్రిందపడి మొత్తముమీద సురక్షితముగా పోలీసు స్టేషను చేరుకున్నాడు. ఇంటియజమాని కేకలవలన గ్రామస్థులు సుమారు యాభైమంది తమ్మునమే గుమికూడి ఈసంగతి అక్కడ దౌరాపై యున్న మున్సిఫు, మధ్యం తాలుక్దారు గార్లతో మనవిచేసుకొనిరి. వారు తగురీతి విచారణచేసెదమని వాగ్దానము చేసిరి మిగట రాత్రి సుమారు ఒంటిగంటకు ప్రజలు తమ యిండ్లకు వెడలిపోయిరి. వివరములు విచారించగా ఈ అమీనుగారికిట్టి చర్యలు క్రొత్తకావనియు ఎర్రుపాలెము దఫేదారుగారు వారు ఇద్దరు జాయంటుగా తరుచు శృంగారచర్యలు జరుపుచుందురనియు తెలిసినది. ఇతర వివరములకొరకు ఎర్రుపాలెము వెళ్లుచున్నారు.

## మంథెన

(స్వకీయ విలేఖరి)

౧౧-౧౧-౪౬ ఇ.

### కీ. శే. తిరువంగము పాపయ్య శాస్త్రులవారు

సుప్రసిద్ధాంధ్ర భాషాభిమానులును, కవివర్యులును తిరువంగ పాపయ్యశాస్త్రిగారు ఈమధ్య కొద్దిగాజబ్బుపడి అకాలమరణమునకు పాల్పడిరని తెలుపుటకు విచారపడుచున్నాము. వీరప్రావధానులు, శాసన పరిశోధకులు. శ్రీ శ్రీనివాసరావుగారు మూర్తి, బి. ఏ. ఎల్ ఎల్: బి. ఈగ్రామపు చరిత్రను వ్రాయునపుడు వారికి కీర్తిశేషులు చాల సహాయపడి యుండిరి. స్థానిక గ్రంథాలయపు కార్య నిర్వాహకులలో నొకరైయుండిరి. వీరి యకాల మరణమువలన మంథెన్నకు యొక యాంగ్లాభిమానియగు కార్యకర్తను గోల్పోయినది.

## మోతె

[ఒక విలేఖరి]

౯-౧౧-౪౬:—

### గురుపుగారు బలవంతముగా మధుమాంసము నోటిలోగ్రుచ్చుట

శ్రావణశు॥ ౪ మంగళవారము రోజున యీ గ్రామమందలి ఒక అయ్యవార్లంగారు దేవీతిరునక్షత్ర మహోత్సవము సలిపి శిష్యులను సాపాటు కాహ్వానించిరి, అహ్వానింపబడినవారలలో చాద్రాని వెంకటచిన్నయ్య యనువారొకరు గలరు వీరిప్పుడు ఆర్యసమాజ సిద్ధాంతము లవలంబించినారు. ఇట్టివారికి అయ్యవార్లంగారు బలవంతముగా మధుమాంసమును నోటగ్రుక్కిరి. వారు వాంతిచేసుకొనుటవలన, అయ్యవార్లంగారదివరకే పరవశులై యుండినందున, వారిముందర సారాయిబుడ్డి కాగిదముపెట్టి మాటుకమువిడకున్న సారాయి త్రాగుము లేదా ముందు తప్పక మామతమందు చరింపబడుచున్న మధుమాంస పద్ధతులను ముందుతప్పక ఆచరింతుననియొకరారునామా వ్రాసియివ్వమని బలవంత పరచెను.

పరమేశ్వరు డీమాధ్వాచారమును అయ్యవార్లమం డెప్రుడు రూపుమాపునో?

డోంగ్రే గారి
బాలామృతము
బలహీనమైన
బిడలకు
పుష్టియును
బలమును
ఆరోగ్యము
నిచ్చును.




## హైద్రాబాదులో బొంబాయిమాదిరికుట్టిన బట్టలు

మా దుకాణములో వివిధ విధములైన కోట్లు పట్లోనులు, కమీజులు, సైలర్ సూట్లు, షేర్వానీలు, ఖాకీస్కాటు షర్టు నెక్కర్, ఖాకీకోట్, పట్లోన్, లాగులు, అఫ్ఘారంలు, బనియనులు, పిల్లల రేష్మి, మఖ్మల్ ఫ్రాగులు, జాకిట్లు, మొదలగు దుస్తులు, సరసమయిన ధరలకు అమ్మబడును. ఒకసారి ఖరీదుచేసి పరీక్షించుడు.

ప్రధాన కార్యాలయము—

పతంగెబ్రదర్స్' సాలార్ జంగ్ బిల్డింగ్
హైద్రాబాదు-దక్కన్.

బ్రాంచి
గవర్నమెంటు బిల్డింగు నం ౨౧ పురాన జైలుబజారు
సికింద్రాబాదు.

Run up!! Run up!!

**GET YOUR LUCKY NUMBER SOON**

H. S. L. C. 1937-38

AN EXHAUSTIVE GUIDE

For English Nonditailed and detailed.

Publishers:-
Venktrama & Co., 3993 Market street,
Secunderabad. Dn.

Don't loose your lucky number. Buy soon.!

1st prize 20 th cent. Chamber's Dictionary (Costing 6-0-0

2nd prize. P. Sankaranarayana's medium English-Telugu Dictionary Costing 3-8-0

3rd prize Captain fountainpen 14ct. gold nibfitted No. 108 costing 2-8-0

4th prize. oxford little dictionary costing 1-4-0

5th prize An exhaustive notes given free cositng 1-0-0

The lucky numbers will be published shortly Don't loose your numberpage. See carefully when you buy

Copies can be had from;-
Venktaram & Co.,
Market street,
Secunderabad.
or
From your head master or from any leading book sellers in Hyderabad and Secunderabad.

డాక్టర్ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి
బెజవాడ.
వీరి ఔషధములును గ్రంథములును
ఆంధ్రదేశమునందు అతిప్రసిద్ధములు
కావలసినవారు పైవారికి వెంటనే వ్రాయవలెను.
పెద్దకేట్లాగు ఉచితము.

# ది డెక్కన్ అస్యూరెన్సు కంపెనీ లిమిటెడ్, బెజవాడ

ఈకంపెనీకి యిపుడే ఐదు వ్యాపారసంవత్సరములు పూర్తియయినవి. ఇండియా గవర్నమెంటువారియొద్ద రూ 1,00,900 లు డిపాజిట్లువునవి. సుమారు ఒకటిన్నర లక్షల ఆస్తులుగలవు. కంపెనీయొక్క మొదటి వాల్యూయేషను జరుగుచున్నది. ఫలితములు త్వరలో ప్రకటింపబడును. కంపెనీ యింకనుచాల యభివృద్ధి గాంచుచు నందరి యందుబాటులో నుండునట్లు భీమా పద్ధతులను గల్గియున్నది.

"డెక్కన్" అస్యూరెన్సు కంపెనీలో ఒకపట్టాను పొందుట చాల లాభకరము

శీలంశెట్టి గోవర్ధనరావు,బి. ఏ., బెజవాడ
మేనేజింగ్ డైరెక్టరు

నండూరి వేంకట కృష్ణమాచార్యులు, బి. ఏ.,
ఆర్గనైజరు, హైద్రాబాదు స్టేటు.
1488, స్టేషన్ రోడ్డు, హైద్రాబాదు(దక్కన్).

# గోలకొండపత్రిక

ఈశ్వరనామ సం॥ర శ్రావణశు॥ ౧౩

గురువారము


## పాఠశాలల బోధన సమయమందు మార్పు

మేము ఇదివర కనేకమారులు ఎన్నియో ప్రజాహిత విషయములను సూచించియుంటిమి. ఆ సూచనలలో చాలవిషయములు మనరాష్ట్రమందు కాకున్నను ఇతర ప్రాంతములందైనను అమలులో నచ్చుచున్నందులకు సంతోషించు చున్నాము. మేము భవభూతివలె తృప్తిపడువారము. ఆయన సమకాలిక లాక్షణికవిత నిరసింపగా—

"యే నామ కేచిదిహ నః ప్రథయంత్యవజ్ఞాం జానంతి తే కిమపి, తాన్ ప్రతి నైష యత్నః॥ ఉత్పత్స్యతే స్తి మమకోపి సమానధర్మా। కాలో హ్యయం నిరవధిర్విపులా చ పృథ్వీ॥

"ఎవరైతే మమ్ము చులకనగా చూతురో వారును పెద్దమనుష్యులే. కాని మా పరిశ్రమను అర్థము చేసుకొనువారు పుట్టకపోవుదురా? పుట్టగలరు. ఎందుకనగా ప్రపంచము విశాలము, కాలమూ అనంతము." అన్నాడు. ఆ మహాను భావుడు భవభూతి.

మేము రెండు మూడుమారులు సర్కారీ ఉద్యోగుల జీతముల తగ్గింపు విషయమును గురించి వ్రాసియుంటిమి. నేడు ఆ తగ్గింపులకు బ్రిటిషిండియాలో కాంగ్రెసు మంత్రివర్గమువారివలన అమలు రాబోవుచున్నది.

మేము పల్లెటూళ్ళయందలి ప్రైమరీ పాఠశాలల బోధనసమయమును మార్చవలెనని సూచించియుంటిమి. తిరువాన్కూరులో దానికిపుడు కార్యరూప మేర్పడినది. ఏజాతివారు మన దేశమును జయించుట వచ్చిరో వారందరును తమతమ దేశనాగరికత, భాషలను మనపై—యిష్టముండనీ యుండకపోనీ, మనకు పరిపడనీ సరిపడకపోనీ— మోపుచువచ్చిరి. మొగలాయి పాదుషాలు మొగల్ పోషాకును, ఫార్సీ భాషను, ఖాజీల అదాలతులను, ఏర్పాటుచేసిరి. అదేవిధముగా ఇంగ్లీషువారు ఇండియాను వశపరచుకొని తమ నాగరికత మనపై మోపిరి. ఇంగ్లీషుభాషకు ప్రాధాన్యత మేర్పడెను. ఇంగ్లాండు దేశములోని దర్జాప్రకారమే ఉద్యోగుల జీతములు హెచ్చుగా నేర్పాటుచేసిరి. కాంగ్రెసువారు సెలవిచ్చినట్లు నిజముగా ఈ దరిద్ర దేశములో ౫౦౦ రూపాయల నెలజీతమే పరమావధిగా నుండదగినది. కాని ఇంగ్లీషువారికి వారి ఖర్చులనుబట్టి యీ ౫౦౦ రూపాయీలు ఎందుకును సరిపోక పోవచ్చును. మన దేశమునకు పూర్వపు పంచాయితీ పద్ధతులే ప్రాధాన్యముగా నుండవలసి యున్నను ఆంగ్లపద్ధతిపై న్యాయస్థానములు స్థాపింపబడినవి. కాని యింగ్లీషుభాషానూను సారీకులలోను, వజాయర్లలోను, ఈక్విటీలోను, చదువురాని దేశీయులు ఇరుకుకొని అర్థము చేసికొనలేక ద్రవ్యనష్టము పొందుటయేగాక పలుమారు న్యాయముకూడ వారికి లభించుట లేదు.

అది యట్లుండనిండు. గమనింపదగిన విషయమేమన, చలిదేశమగు ఇంగ్లాండులో పాఠశాలలు పదిగంటలనుండి ౪ గంటలవరకు పనిచేయుట సహజమే. అదిధనిక దేశముస్వతంత్ర రాజ్యము. ప్రజలకు విద్య ఉచితమేగాక నిర్బంధముగా గరుపించుచున్నది. ఇక మన ఈ దేశములో పరిస్థితులు అన్నియు తలక్రిందులే. ఇది దరిద్రదేశము." పరాధీనతలో చిక్కియున్నది. మనది ఉష్ణదేశమగుటచే ఇంగ్లాండునకు సరిపోయిన వేళలు మనకు సరిపోజాలవు. పూర్వకాలములో మనదేశమున చీకటితోనే మేలుకొలుపులతో బళ్ళు ప్రారంభమగుచుండెను. పైగా పల్లెలలో బీదవారున్ను, పనిపాటలవారున్ను, వ్యవసాయకులున్ను, ఎదుగుచున్న తమపిల్లలతో పొలాలలో పనులు చేయించుకొనుచుందురు. బీదవారికి విధాయకము లేదు కాన అది తప్పనిసరి. అందువలన పట్టణములలో కాకున్నను పల్లెలలో నైనను బళ్లలోని కాలము మార్చుట చాల అవసరమైయున్నది. మనదేశ ముష్ణదేశమగుటచేత బాలురకు ప్రాతఃకాలములో ౬ గంటలనుండి ౧౦ గంటలవరకును, సాయంకాలము ౪ నుండి ౬ వరకును లేక యించుమించు యిట్టిమార్పుతో పల్లెలలోనిబళ్ళు ఏర్పాటుచేయుట చాల అవసరము. తిరువాన్కూరుసంస్థానములో ఎన్నియో దివ్యమైన మార్పులు దినదినము జరుగుచున్నవి. శ్రీమంతు మహారాజులుంగారు నిజమైన ప్రజానురంజకులై యుండుట ఆసంస్థాన ప్రజల పుణ్యతపఃఫల మనవచ్చును. శ్రీ మహారాజులుంగారు హరిజనులకు దేవాలయప్రవేశము అనుగ్రహించిన వార్త ప్రపంచమందంతటను మారుమ్రోగిపోయినది. తిరువాన్కూరు దర్బారువారు ఏటేట విద్యకై ఆదాయములో నూటికి ౨౩౹ పాళ్ళు ద్రవ్యము వ్యయముచేయుచున్నటుల తెలిపియుంటిమి. ఇప్పుడు దర్బారువారు పాఠశాలలలోని వేళలలోమార్పుచేసి ప్రాతఃకాలమందే బళ్ళు నడుపుటకు ఆజ్ఞయిచ్చినందులకు ప్రశంసాపాత్రులైరి. మనరాష్ట్రము దర్బారువారును ఇట్టిమార్పుచేయు విషయములో ఆలోచన చేయుదురని కోరుచున్నాము.

## బాల్యవివాహ నిషేధము.

హిందూ సంఘమునావరించియున్న దురాచారములలో బాల్యవివాహమునకు ముఖ్యస్థానముగలదు. మూఢాచారుల ప్రాపున యిది ముద్దుగా పెంపొందినది. గారాబముతో పెరిగిన దీని ఆటపాటలన్నియు సంఘమునకు హానికరముగా, నాశనకరములుగా నున్నను మన పూర్వాచారపరాయణ ప్రవీణులకు మాత్రము ముచ్చటగానుండుట దుఃఖకరము.

నేడు భారతీయులందు నిర్వీర్యత్వము, నిస్తేజత్వము, దౌర్బల్యము, పరికితనములేగాక వీరు అకాలమృత్యు దేవతకాహారవస్తువులుగా పరిణమించుటకీ యసద్ధాచారమొక ముఖ్యకారణ మనవచ్చును ఈ పెనుభూతము దేశమునందు విచ్చలవిడిగా విహరించుటచే నుయ్యాలలోనూగు పసికూనలు వితంతుత్వమునకు గురియగుచున్నారు. సంఘమునకు, దేశమునకు దీనివలన సంభవించుచున్న అనర్థము, దౌర్బల్యముగాంచి దీని నిర్మూలమునకు, దేశమునందు ప్రజలలో మూఢత్వము, అజ్ఞానముండునంతవరకివి ప్రజలవలన యంతము కాజాలవని, హరవిలాస్ శారదాగారు ప్రభుత్వసాయముతో శాసనరూప మేర్పరచిరి. పూర్వాచార సాంప్రదాయులు లోలోన సంతసించినను, నలుగురికి విశదపరచుటకై బ్రిటిషు ప్రాంతములందు శిక్షార్హమగుటంజేసి ఫ్రెంచి ప్రదేశము—పాండిచేరి, బందరు యందలి ఫ్రెంచుపేట మొదలగు పరిసరప్రాంతములు— నిజాంరాష్ట్రములను బాల్యవివాహములకు కార్యక్షేత్రములుగా నొనర్చిరి. వీరి దౌర్భాగ్యమువలన—అదిజాతి సంఘమునకు శ్రేయోదాయకము. ఫ్రెంచి ప్రభుత్వాధీనమందలి భారత ప్రాంతములందు సహితము నిషేధింపబడినది. ఇక వీరికి మిగిలిన దీ ప్రాంతమే.

ప్రజాహిత కార్యములందు తన్మయులు. దేశసేవాపారీణులు, ఆంధ్రమహాసభాధ్యక్షులగు శ్రీ కొండా వేంకటరంగారెడ్డిగారు దీనిని రూపుమాపుటకు మన శాసనసభయందు చిత్తుశాసనము ప్రవేశపెట్టబూనిన విషయము పాఠకులకు విదితము. ఇతర రాష్ట్రములందలి సోదరులు గడించుచున్న అభ్యుదయము చూచి ప్రజలు మేల్కొని యీదురాచారమును తొలగించుటకు స్వయముగా ప్రయత్నించవచ్చునని శ్రీ రెడ్డిగారు భావించియుండవచ్చును. ఈ స్థితిలో అట్లుజరుగుటసంభవము. అజ్ఞానదశయందల్లాడుచున్న వారేగాక ప్రాచీనాచార ప్రభావములవలన వ్యామోహితులగుచున్నవారు యీ యమూల్యకృషియందు ముందంజవేయుదురని యాశించుట కందరాని ఫలములకై నాశించుటయేయగును. కాబట్టి శ్రీ రెడ్డిగారు ప్రభుత్వమువారి సాయముతో దీనిని శిక్షార్హముగా పరిణమింపజేసిన దేశమునకు, సంఘమునకెంతయో యమూల్యసేవ సలిపినవారగుదురు. హిమాచలమునుండి కన్యాకుమారివరకు, బర్మానుండి కరాచీవరకు పూర్తిగానరికట్టబడుటవలన వీరి యాటలకు తావుస్థానము చిక్కనందున యనతికాలములోనే యంతమొందుట నిశ్చయము. దీనివలన మన రాష్ట్రమునకేగాదు యావద్భారతదేశమున కొకయపూర్వమగు మేలు చేసినవారగుదు రనుట నిక్కము.

### దేవీ సాత్వికపూజలు

అమ్మవారి పేరున జంతువుల బలియిచ్చి, తామసిక దేవీపూజ జరిపినందువలన కొన్ని దినములలోపలనే అప్పులవాళ్లు పెట్టు ముప్పులకు లోనయి నానా బాధలుపడేవారు. ఈ సంవత్సరము సికింద్రాబాదు మానవ సేవాసమితి, ఇతర జీవరక్ష ధర్మప్రియుల పరిశ్రమకు సరియైన ఫలము కలిగినది.

ఈ సంవత్సరము మూగపశువులయెడ నిశ్చయమైన దయా భావముపుట్టి జంతుబలి కొరకు వేయబడు చందా పట్టికయందు సాహుకారులు చందా మానివేసిరి.

ఈ సంవత్సరము బీదలకు మేలనుకలిగినది. రాత్రింబగలు జీవరక్ష ప్రచారక మండలివారు నగరములోని వీధివీధికినిబోయి మేళతాళములతో కరతాళ పాటలు, భజనలు, ఉపన్యాసములు యిచ్చి, కరపత్రములు పంచుటకు ఫలము కలుగకుండునా? ఇదివరకు సాత్వికపూజచే జరిపించి వేలకొలది మూగపశువుల ప్రాణదానము చేసినవారి పట్టికలో యాక్రిందివారి నామములు చేర్చబడదగినవి.

(౧) చిన్న చెంచెలగూడ, ధర్మసేవాసమితియొక్క కృషివలన తా ౫ ఆగష్టు ౧౯౩౭ నాడు అమ్మవారికి సాత్వికపూజ నేత్రోత్సవముగా జరుపబడెను. దీనికి ప్రోత్సాహకర్తలు. (౧) భట్టుస్వామిగారు (౨) సమితి కార్యదర్శి శ్రీపతిగారు (3) చి॥స్వామిగారు (౪) గో. గోపయ్యగారు (౫) బి. మల్లయ్యగారు (౬) గో. సత్తెయ్యగారు (౭) వి. యాదగిరి రావుగారు తదితర్లు యీ సత్కార్యమును జేయించి మూగపశువుల శుభాశీర్వచనములు పొందుటయేగాక ఇతరులకు మార్గదర్శకులైరి.

### ఆయుర్వేద ఔషధాలయ వార్షికోత్సవము

ఖిలావత్పురమందలి విరలాయుర్వే సౌషధాలయ వార్షికోత్సవము ది ౭-౧౧-౪౬ శుక్రవారము జరుగునట్లుగా యిదివరకు వ్రాసియుంటిమి. పోలీసువారి సభకు అనుజ్ఞనీయనందున తిరిగి (౧౭-౧౧-౪౬ఫ) శ్రావణశు॥౩ మంగళవారము జరుప నిశ్చయింపబడినటుల ఆహ్వానసంఘ కార్యదర్శి తెలుపుచున్నారు,

## స్థానికవార్తలు

### సెలవు

౩ సెప్టంబరు మంగళవారము రోజున మ. ఘ. వ. నిజాం ప్రభువుగారి జన్మదినమగుటచే యీరాష్ట్రమందలి బ్రిటిషుపాలనాప్రదేశములకు సెలవంగీకరించినటుల రెసిడెంటుగారు విశదపరచిరి.

### అంజుమనె ఖాదిముల్ ముసల్మీన్

నవాబు మెహదీయార్జంగు బహద్దురు, నవాబు ఫఖుర్యార్జంగు బహద్దురుగారు పై సంస్థ సందర్శించి తమ సంతసము తెలిపిరి.

### మోసకారుల నిర్బంధము

బెజవాడ ప్రాంతమువారు కొందరు యిత్తడి వస్తువులను బంగారముగా మోసగించి విక్రయించుచున్న వారిని జిల్లా ఖుఫియా పోలీసువారు నిర్బంధించిరి.

### విషాద ప్రకటనము

పోలీసుశాఖలో రాయచూరునందు మొహతమిముగా నుండిన నారాయణరెడ్డిగారి మరణమునుగురించి శాఖాధ్యక్షులు తమ విషాదము తెలిపిరి.

### ప్రయాణపు ఖర్చులు

నగర, జిల్లా పోలీసు సబ్ యిన్స్పెక్టరులకు ముందు ప్రయాణపుఖర్చు లొసగుటకు ప్రభుత్వాధ్యక్షు లంగీకరించిరి.

### రు౨౦౦ ల అలవెన్సు

నిజామాబాదు అవ్వలు తాలూకాదారుగారికి ప్రతిమాసము రు౨౦౦ డ్యూటీ అలవెన్సుగా అంగీకరింప బడినది.

### నవాబు బసాలత్ జం బహద్దురు

నవాబు బసాలతుజం బహద్దురు గారు సోమవారంరోజున చంచలగూడెం హైస్కూలును వీక్షించిరి విద్యాశాఖాధ్యక్షులు, నగరపు డివిజను యిన్స్పెక్టరు నవాబుగారిని స్వాగతమొసగిరి, నవాబుగారు హైస్కూలు నందలి ప్రతితరగతిని జూచి సమయానుసారముగా బాలురులను ప్రశ్నించి తమ సంతసము విశదపరచిరి.

### మరణము

వైద్యమునందని భ్రమించి నల్లమందు తినిన ౧౬సం॥ల ప్రాయమువాడొకడు సోమవారం జనరల్ ఆస్పత్రిలో మరణించెను.

### నైజాం ప్రభువు

మంగళవార ముదయము ౧౧గంటలకు ప్రభువుగారు "మీర్కి దాయిరా" యందలి మొదటి సర్ సాలార్జంగు గారి సమాధివద్దకేగి జియారతునంతరము తిరిగివెళ్లిరి.

### సాలీడు భుజముపై "మహమ్మదు" శబ్దము

నూరకు ప్రాంతమందలి కర్ణూలునుండొకరిటుల వ్రాయుచున్నారు:-

మాగ్రామమందలి అంజుమనె యిస్లామియాబడి సమీపమందలి యొకమసీదు కాంపౌండులోని గదియందొక విచిత్రమగు సాలీడు గూడు కట్టుచున్నది. పురుగు మెడ నడుము వల్లగాగలదు. పచ్చని భుజముపై "మహమ్మదు" శబ్దము (ఏభాషయందో?) గలదు. వీపుపై యేమో వ్రాసియున్నది గాని చదువ వీలులేదు రోజు వందలకొలదిమందివచ్చి చూచుచున్నారు.

### హరిజన వసతి గృహమునకు భూరి విరాళము

సామనగరము ఐదవ ఆంధ్రమహాసభ ఆహ్వానసంఘము పక్షమున హరిజనవసతి గృహమునకై రు౧౫౦-౦-౦ విరాళ మొసంగినందులకు గాను, ఆహ్వాన సంఘమువారికి, ముఖ్యముగా కార్యదర్శులగు శ్రీయుత బూర్గుల వెంకటేశ్వరరావుగారికి, అధ్యక్షులగు నారాయణ రెడ్డిగారికిని హరిజనవసతి గృహము పక్షమున హృదయ పూర్వకమైన కృతజ్ఞతను తెలుపుచు వసతి గృహాధ్యక్షులు వ్రాయుచున్నారు.

### హైద్రాబాద ఆరోగ్యము

౭వఆగష్టుతో అంతమగు వారమందలి ఆరోగ్య వివరములు:-

ప్లేగు

నగరమునందు ప్లేగువలన యెవరు రోగపీడితులు కాలేదు.

పరిసర గ్రామమగు కంపూబాదనం దిద్దరు మరణించిరి.

మీరాలంమండీలో ౨యిండ్లయందు ప్లేగు పీడిత మూషకములు చిక్కినందున గృహము శుభ్రపరచబడినవి. ౨౨౨ మందికి టీకాలు వేయబడినవి.

కలరా

అంటువ్యాధి వైద్యాలయమునందు చేర్చిన యిద్దరిలో నొకరు మరణించిరి.

ఇతరములు

విషమజ్వర, మశూచిక బాధితు లెవరు వైద్యాలయమునందు చేర్చబడ లేదు.

### గ్రంథ నిషేధము

"ధర్మశరము" "పాయిజనగలేకు," "పుష్పాంజలి" గ్రంథములు ప్రభుత్వమువారి వలన నిషేధింపబడినవి.

### హైదరాబాదు అనువంశిక ఆయుర్వేద వైద్యసంఘము

దీని మాసిక సమావేశము ప్రతి పూర్ణిమనాడు జరుగు నియమమున్నను, ఈసారి రానున్న శనివారము పూర్ణిమనాడు రాఖీ పున్నమ యగుటచే జరుగదు. ౨౩ ఆగష్టువాటికి జరుగును. గతమాసిక సమావేశములో ఈసంగతి సభ్యులకు తెలుపనందున, ఇపుడు పత్రికాముఖమున ప్రకటించనైనది.

### పత్రికా నిషేధము

(౧) ది కమ్యూనిస్టు ఇంటర్నేషనల్, (౨) ఇంటర్నేషనల్ ప్రెసు కరెస్పాండెన్సు, (3) ది లేబరుమంథిలి పత్రికలు రాష్ట్రమునందు నిషేధింపబడినవి.

### ప్రజాపక్ష విద్యామహాసభ

నాలుగవ ప్రజాపక్ష విద్యామహాసభ ౧౨,౧౩ షర్వర్ది ౧౩౪౬ఫ. గుల్బర్గాలో జరుగును.

## న్యాయస్థానము

విరదు ౧౧-౧౧-౪౬.

### ఉప్లా మత కల్లోలము

#### ౪౬ రు పై అభియోగము

ఇటీవల ఉప్లా గ్రామమునందు జరిగిన దొమ్మియందు ౩గురు హిందువులు హత్య గావింపబడియుండిరి. ఆసందర్భములో నిరదు పోలీసు నిర్బంధించిన మహమ్మదు ఉస్మాన్ మొదలగు ౪౬ రు పై నిరదు మున్సఫీయందు అభియోగము పోలీసువారివలన పెట్టబడినది. రా మొహరు తేదిన యీ అభియోగము ఫజల్ హఖ్ ఖాన్ డిస్ట్రిక్టు మేజిస్ట్రేటు గారివద్ద విచారణకు దేబడెను. నేరారోపితులలో ౧౦ మం దింకవరకు చిక్కలేదు. మిగతవారిపై హత్య, దొమ్మి, దోపిడి నేరము లారోపింప బడినవి. నేరారోపితుల పక్షము నుండి ముర్తుజా అహమద ఖాన్సారి, మహమ్మదు అబ్దుల్ కదీర్. ఖయ్యూముల్ హఖ్, అబ్దుల్ లతీపుస్మాన్, ముల్లానుఅహమదు, సయ్యదు హైదరురజా ప్లీడరు వకీల్లు గలరు.

అభియోగము విచారింపురాగా ముర్తజా అహమద ఖాన్సారీగారి విచారణ సెషన్సు స్వాధీనము కావలయునని దరఖాస్తుపెట్ట మెజిస్ట్రేటుగారు దానిని అంగీకరించి మెడికల్ అధికారి వాఙ్మూలము గైకొనెను.

అనుభ్యాన్నమే అన్సారి గారు సెషన్సు (గుల్బర్గా) విచారణ విదరునందు జరుగవలసినదని ప్రార్థించిరి. సెషన్సు జడ్జిగా రంగీకరించి నేరారోపితులను విదరుజిల్లాలో విచారణగునంతవర కుంచబడుట కాజ్ఞ యొసగిరి.

### దొంగనోట్ల అభియోగము

హైద్రాబాద, ౧౨-౧౧-౪౬:—

ఇదివరకే తేది తీర్పుకై నిర్ణయింపబడియుండెను. కాని ౧౮ మొహరు తేదికి మార్చబడినది,

## పురపాలక సంఘపు ఎన్నికలు

ఓటరులారా మేల్కొనుడు!

పురపాలకసంఘపు ఎన్నికలు ఓటర్ల, లిస్టు తయారుకాని కారణముచే. మొహరునుండి ఆబాను నెలకు నెట్టబడినవి. ఇంకను తమకొత్త గ్రహించని ఓటర్లు మేలుకొనుటకు ఇంకొక నెల గడువుచిక్కినది.

పోయినఎన్నికల తరువాత వివిధ పురపాలక సంఘసభ్యులు, వారల నెన్నుకొని తమ ప్రాంతములందలి అవసరములను తీర్చుటకును, మొత్తముపై నగరజనుల పరిస్థితులు బాగుచేయుటకును ఏమేమి కార్యముల జేసినారో, వారలు చేసిన కార్యములవల్ల ఫలితమెంత చేకూరెనో వివిధహల్కాల ఓటర్లును చక్కగా ఆలోచించుకొనవలసిన సమయమిది. ఏలను, తిరిగి పూర్వసభ్యులు ఓట్లకై నగరప్రజలవద్దకి రానున్నారు. ఆసభ్యులుఏమియు ఎక్కువ చేయలేదని గాని, తాము అంతంతె ఎక్కువచేయగలమని గాని చెప్పికొంత్తవారలను పురపాలక సంఘ సభ్యత్వము పొందగోరి వోటర్లవద్దికి రానున్నారు. కాబట్టిఎవరిని తమతమ ప్రతినిధులనుగ బంపవలెనో ప్రతివార్డునందలి ఓటుహక్కుగలవారును సరిగా ఆలోచించి తెల్పుకొని సిద్ధముగా నుండవలసిన సమయము వచ్చినది.

ఎవరికో ఒకరికి ఓటుఇచ్చి ఉపేక్ష చేయుట పౌరులకు ధర్మముకాదు: నగరప్రజల పరిస్థితులను, పురపాలక సంఘాధికారములను లోబడియున్నంతవరకు, బాగుచేయుటకు శ్రద్ధ వహించనివారలను, సోమరులను, స్వార్థపరులను ఎన్నుకొని పురపాలనాధికారము అప్పగించిన యెడల, దానివలన కలుగు నష్టము నకు ఓటరులగు పౌరులే బాధ్యులు. ఓటుఅనునది మంచివిబ్బర వివేకముతో ఉపయోగించుటకై దయామయులగు ప్రభుత్వమువారిచే ప్రసాదింపబడిన హక్కుగాని, ఉపేక్షతో, ఎవరికినిన వారలకిమ్మనట్టిగాని, భ్రమమునకు అమ్ముకొనదగునట్టిగాని వస్తువుకాదు.

ఈసందర్భమున ఒకఉదాహరణముగ నాంపల్లి ప్రాంతమును గూర్చిచెప్పెదను. ఈ నాంపల్లి బజారుగోడ్చుమెకు రైలుస్టేషను సమీపమునమంత సర్కారిఇండ్లప్రాంతము లో కొన్ని వీధులందు రాత్రుల దీపముల ఏర్పాటులేమాత్రము జరుగలేదు. చీకటిరాత్రులందు ఆవీధులలో ప్రయాణము చేయువారలు వీధులలో పశువులనియుండు నక్కడక్కడ కాళ్లుతొక్కుటయు, అక్కడక్కడ "శాలా" అనిశబ్దముటయు ప్రయాణీకుడు భయముతో తెరక్కలాడుటయు తటస్థించుచుండిన, ఆశ్చర్యములేదు, ఈప్రాంతము కలుగిడ్డంగివారు గలదు. అక్కడ ప్రాగిన జనులు సమీపమునవే దీపాలు లేని వీధివద్ద లొల్లి పెట్టుచుందురు. ఈయిండ్లయందుండరలో గౌరవవంతులగు సర్కారుఉద్యోగులేగాక ఇతరులును నివసించుచున్నారు. ఇట్టి గౌరవవంతులకు ఇటువంటి వీధుల సమీపములందుండుటలో గలఅసౌకర్యములనుగూర్చి వారలెంతో అనుకొనుచున్నారు నగరమునపెద్ద కార్పొరేషనువచ్చి ఏండ్లుగడచినను ఈపరిస్థితి బాగుపడలేదు.

తర్వాత క్రొత్తనాంపల్లిలో, ఇపుడు క్రొత్తగా కట్టబడుచున్న సర్కారుఇండ్లకెదురుగా ఉత్తరము వెపుపోవు వీధిలో సర్కారిడాక్టర్లు, కాలేజీల ప్రొఫెసర్లు, మిలటరీ ఉద్యోగులు ఉన్నారు. ఆవీధికొనను యలెక్ట్రికు దీపముతప్ప మరెక్కడను వీధిలో ఒక్క దీపమైనను లేదు. దీనిని అక్కడినివాసులు కందుచున్నారు. కాని ఏమిలాభము? అధికారము వారల చేతులలోనుండ, ఎన్నికల సమయములలో సన్మతమైనవారల నాలోచించి ఎన్నుకొనువిషయములో శ్రద్ధచూప ఇపుడు విచారపడుటవలన, కాబట్టి ఈసారియైనను నాంపల్లిఓటర్లు ముందుగా ఈవిషయము ఆలోచించుకొని తగినవారినెన్నుకొనవలెను. అశ్రద్ధ చేయరాదు.

ఇతరహల్కాలలో వోటర్లుకూడ ఇట్లే ఆలోచించుకొని తమలాభమును, నగరక్షేమమును కాపాడుట ధర్మము. ఇట్లు

ఒక నాంపల్లినివాసి

### "మోతీమహల్ దురంతము"

హైద్రాబాద; ౧౨-౧౧-౪౬:—

ఈఅభియోగము నేడు రాయిరాజ్మోహన్ లాలు స్పెషల్ మేజస్ట్రేటుగారివద్ద విచారణకు రాగా పోలీసు సాక్షులగు అబ్దుల్ రవూఫ్, మహమ్మదు బేగు సాక్ష్యములు గైకొనబడినవి. ఇష్టఖారున్నిసాబేగం, బోమారాబేగం, మాతీబాయి నాయకుగారి వాఙ్మూలములు కమీషన్ద్వారా తీసుకొనుటకు ౧౮ మొహరుతేది నిర్ణయింపబడినది. 30 మొహరురోజున యస్. టి. హాలిన్స్ గారి సాక్ష్యము గైకొనబడును.

"నేరస్థులందరు యజ్ఞనారాయణశర్మ స్వయముగా న్యాయస్థానమునకు వచ్చిరి. ఇతరకార్యములవలన వ్యవధి చిక్కకుండుటచేత కజవీజా పూర్తికాలేదు. ౧౫ మొహరుకు మార్చుచు నేరస్థులు పూర్వము మాదిరి జమానతుపైనుండుటకు, ఆరోజు న్యాయస్థానమునకు స్వయముగా రావలసినది. ఇంతలో యజ్ఞనారాయణ న్యాయస్థానమున కరుదెంచుటవలన యితర నేరస్థుల విషయమునకల నియమ లేకని కర్తవ్యయింప వలయునని న్యాయమూర్తులు తెలిపిరి.

